శ్రీ రస్తు

శ్రీ రామభజనామృతపానమను

# సావిత్రి

విజయము

రెండవభాగము

[సీనరీల శ్రీ హరిభజననాటకము]



ఇది

మారేడుబాక వాస్తవ్యులగు

**పుట్టా రామదాసుగారిచే**

రచియింపఁబడినది

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరమున

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు మల్లిడి సత్తిరెడ్డిగారిచే

ముద్రింపఁబడి

గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది.

**1929**

 [వెల 0—8—0]

# ఇందు ధరించు పాత్రలు



## పురుషులు

భజనచేయు బాలుడు—

సూత్రధారుడు—

ద్యుమత్సేనుడు—సత్యవంతునితండ్రి-అంధుడు

సత్యవంతుడు—కథానాయకుడు

యముడు—జీవనాథుడు

చిత్రకేతుడు—సత్యవంతుని శత్రుడు

సాళ్వదేశప్రజలు

## స్త్రీలు

నటి—

భద్రాంగి—సత్యవంతుని తల్లి

సావిత్రి—కథానాయకి

కాళి—రవికుల వేల్పు

ఇంకా సమయానుకూలముగా వత్తురు.



# కృతిసమర్పణము



సీ॥ జలధిమధ్యమునలక్ష్మిజనియించినట్టుల పుట్టాన్వయంబున బుట్టెనెవరొ
నిష్ఠతోనామెను శరణమ్మువారిని కన్నులనిడుకొని గాచునెవరొ
కూరిమితోతన్ను గొలచినవారికి కళ్యాణములనీయఁ గలుగునెవరొ
పరగ శ్రీమారేడుబాకగ్రామంబున మహిమతోవిలసిల్లుమాతఎవరొ

గీ॥ అట్టి మా కులవేల్పుకే నమితభక్తి మోడ్చి సాగిలివందనములనొనర్చి
సరగకృతినిత్తుసావిత్రిచరితమెల్ల నిహపరంబులసౌఖ్యంబులిచ్చిబ్రోవ



శుభమస్తు — అవిఘ్నమస్తు.

శ్రీమద్గురు చరణారవిందాయనమః

# సావిత్రీ విజయము

## రెండవ భాగము

### గణేశ ప్రార్థన

కం॥ శ్రీగణనాథునిపదముల నాగిలి వందనము జేసి సంస్తుతిజేతున్
బాగుగనావాంఛితములు వేగముగానొసగుమనుచు విద్యాసక్తిన్ ॥

### 1 ఖీల్వా — ఏకతాళము

గట్టువిల్లుపట్టి నను కరుణజూడు చేపట్టి॥ గట్టు॥ దండిగముక్కంటి-పండ్లను నేనీకు బెట్టి-మెండుగనిను వేడుచుంటిఖండేందుధరునిపట్టి॥ గ॥ 2 పంతమేలదేవ-నాచెంతజేరియుండరావ॥ పం॥ సంతోషముతోడ నాకుఅంతరంగమందునిన్ను-దంతివదనయనిభావించిన దరిశనమే లేదామేను॥ గట్టు॥ 3 కరుణజూపవేర నా మొరవినవిదినీకుమేర॥ కరు॥ పరిపరివిధములనిను నే బ్రతిమాలితి గిరిపుత్ర స్థిరముగ నా కార్యమెల్ల నిర్విఘ్నముగాజరుపుము॥ గట్టు॥ 4 సకలపాపనాశ-ననుకృపజూడుము శ్రీగణేశ॥ స॥ అఖిలలోకవంద్యా నన్నాదరించు-మృదుభాషా-ప్రకటితముగ రామదాసకవిపోషా-సర్వేశా॥ గట్టు॥

### సరస్వతీ స్తోత్రము

### 2 అడుగుకీర్తన

1 ముందూగ దలచితినమ్మా-నీ నందానూని గావుమమ్మా॥ ముం॥ 2 వందానమిదె నీకు-వనజభవుని రాణి-యిందీరకోడాల-వేల్పాల మేటిరో॥ ముం॥ 3 తలవాకిటానుండు-తల్లి కల్పవల్లి-సలలీతముగ కంఠస్వరమూనాకూనిమ్మా॥ ముం॥ 4 నిక్కాముగానీకు మ్రొక్కు-చుంటినమ్మ-చక్కనైనా మృదుమధుర పలుకుల నిమ్మా॥ ముం॥

6 భారాముని దేవా నేరాము లెంచాకు-సాకే సారెకు నిన్ను స్మరణా చేయుచుంటి॥ ము॥ 6 భాసూరముగ రామదాసుని బ్రోవ్రామ-దోసమ్ము గ్గియుంటి-నైన మునివంటి॥ ము॥

[ప్రవేశము సూత్రధారుడు]

సూత్ర: -(సభ కలయుంగనుంగొని, సభాసదులకు నమస్కరించి) సభాసదులారా!

సీ॥ శ్రీరాము నెప్పుడు చేరికొల్చుటెగాని శాస్త్ర మొక్కటియైన జదువలేదు
భక్తితో శ్రీరామ భజన చేయుటెగాని తాళరాగంబులు తరచ లేదు
గోవిందు నవతార గుణము లెచ్చుటెగాని గానవిద్యల నేర్వగడంగ లేదు
పసబాలురము విద్యల్ ప్రావీణ్యులము గాము భరతాది విద్యలంబడయ లేదు
గీ॥ గాన మీరెల్ల మాపైని కరుణబూని తనయులని యెంచి మావల్ల తప్పులున్న
దిద్దుడీ బాల్య యవ్వన వృద్ధులార సత్కథన్ వినవచ్చిన సభికులార!
చెలీ! ఇటు రమ్ము.

[ప్రవేశము నటి]

నాధా! ఈసభాభవన మెల్ల గుట్టలంకరించిరి కారణమేమైయుండును.

సూత్ర:—చెప్పెద వినుము. ఇదివరకు పుట్టా రామదాసుగారిచే రచియింపబడిన సావిత్రీపరిణయము అయినతరువాత సావిత్రి కాళినిగూర్చి వ్రతంబొనర్చుటయు, కాళి వరంబొసగుటయు, పతితో వనముకేగుటయు శిరోవేదనచే మృతినొందిన సత్యవంతుని మరల బ్రతికించుటయు, సావిత్రి పతివ్రతామహాత్మ్యమున కాలునిమనసు గరుగుటయు, అత్తమామలకు రాజ్యంబును, నేత్రంబులును, తన తండ్రికి నూర్వురు పుత్రులను యమునిచే మెప్పువడసి వరములను దెచ్చుటయును, సావిత్రీవిజయ మను నాటకరాజము నుపయోగించ ప్రయత్నించుచుండిరి. మనముసహాయులమై ఆకార్యము నెరవేర్చెదము రమ్ము

గీ॥ మాతదయలేదు ద్వాదశమాసములకు రెండు దినములె తక్కువ లెక్కసేయ
యేమియునుదోచదక్కటా యెవరుదిక్కు గానరారైరి నా పూర్వకర్మఫలము॥

తల్లీ! ఆశ్రితజనకల్పవల్లీ! నే నేమిలోపంబు జేసితిని. నాపై కోపమా!

4 సెలాంబరి — ఆదితాళము

ఏమిసేతూను దైవ మేరీతి రానైనో - సావిత్రి కింకా నాపై దయలేక పోయెనో॥ఏమి॥ 2 నీమునిష్టాలుచూని - నేపూజ జేసితినో - కోపమింకగు నాపై కోపమేవచ్చెరో॥ఏమి॥ 3 ఆపదనినాకు యెట్లాడదలుండెనో - పుత్రుని యెడుగులు గాంచకతప్పునా॥ ఏమి॥ 4 నీరెనినా గడువు రెండు - దినములింకున్నాను చండి దయాతికింకా దాక్షిణ్యమే లేదా॥ఏ॥ 5 తల్లి సంపత్తులు సల్క కల్లగా సెంచితిని - వల్లభు ప్రాణ మెట్లు గాపాడుకొందునో॥ ఏమి॥ 6 ఉల్లముందూన ధైర్యమెల్లనుబోయెను - తల్లడమాయె గుండె ఝల్లుమనుచుండెను॥ ఏమి॥ 7 పతికంటె నాకింక భాగ్యమేమున్నదెను - మతిమాలసేయుగ గతిలేకపోయెను॥ఏ॥ 8 క్షితిరామదాసు నేలు దైవము వినుమమ్మ - బ్రతిమాలి పాదముల బట్టి నే వేడెదాను॥ ఏమి॥

హా! జననీ! పరమపావనీ! శరణాగత బిరుదాంకితవగు నీవిట్లు చేయవచ్చునా?

శా॥ జాలిం జెందవు యేలరావు యిక నీజాగేలనే తల్లిగో
కాలంబంతయు వ్యర్థమాయె యిక నన్ గాపాడ దిక్కెవ్వరే
పూలన్ బూజలు జేయుచుంటిని దయన్ బూనంగ బే దుర్గ నన్
పాలన్ముంచిన నీళ్లముంచినను యీ భారంబు నీదేసుమా!

తల్లీ సావిత్రీ! లోకపవిత్రీ! నీవే యిట్లు జేయ నాకిక దిక్కెవ్వరు? అమ్మా! దుర్గాంబా!

గీ॥ ముంగు మేల్కాంచి నీకు నే మ్రొక్కుచుంటి యిష్టదైవము నీవని యెంచుకొంటి
కష్టములు బాపినాథుని గావుమంటి భవ్యచారిత్రి సావిత్రి భద్రగాత్రి॥

అమ్మా! కాళీ! నిమ్మగాన్ని నేను దినత్రయానుబవమంటి దీక్ష గొని నిద్రాహారములు మాని మ్రొక్కుచున్న నాకు నీవు ప్రత్యక్షంబు గాకుండవచ్చునా? నీకునన్నుగాను ఒప్పినదనూ? నేజేయు తప్పినదనూ? ఇది నీకు న్యాయమా! నా తల్లిదండ్రులబ్రోచిన దయ నిను విడచి పోయెనా లేక యీవనమున గలసిపోయెనా? ఈ తుచ్ఛురాలిపై నీకింత కార్పణ్యమాయెనా? అంగాక నన్నుబ్రోచుటకు నీకు శక్తి చాలకపోయెనా? నేనంతపాపాత్మురాలనా! నాకెవ్వరు దిక్కు. ఏది తెరవు. హా! దైవమా! హా! కాలమా! తీరిగిపోవుచుంటివా? అయ్యో! సూర్యోదయించు వేళాయెను.

గీ॥ సతికిపతిసేవకంటెను సౌఖ్యమేమి ప్రాణనాథునిను లేకున్న బ్రతుకికేల
మొండికెత్తిన స్త్రీయైన ముండబ్రతుకు ననుభవించుట కొప్పునా యవనియందు॥

5 దర్బారు—రూపకతాళము

ఇంత కనికరంబులేద-యిదే నీకుమర్యాదా॥ ఇం॥ చింతదీర్చరావు నాపై-పంతము బలవంతము నా ప్రారబ్ధఫలము॥ ఇం॥ కొంతకాలమైన పతితో సంతోషముదీర లేదు యింతటిపాపినో బ్రోవవు-యేమికారణమొ తెలియను-(మిత్ర)నీ కింతటిశక్తిలేదా నేపతివ్రతనో కాదో-రవ్వంతయు జాలిలేదు-రక్షించవుయేమిసేతు॥ ఇం॥ 2 చిన్ననాట నుండినేను-నిన్నునమ్మి కొలచుచుంటి-విన్నపమాలించకున్న యెవరుండెను నీకన్నా॥

మిత్ర) ఆపన్నతనొందియుంటి-ఆర్తినిరక్షించుమంటిదాపుజేర్చవిదినాపై కోపము-నేముందుజేయుపాపము-నానోముఫలము॥ ఇం॥

8 మును జనకుని బ్రోచిన దయ-యీ యావనమున గలపితివా-నీమనమున నాథ క్తిని బరీక్షించ నెంచితివా
(మిత్ర) దినములన్ని గడచిపోయె-దిక్కెవరు గానరారె-తనువున ప్రాణము బాసెద-దేవికి దయరాకయున్న॥ ఇం॥

4 భూవిభుడగు అశ్వపతికి-పుత్రికనై పుట్టితినా-నీమముతో సాళ్వరాజ పుత్రునకేసతనైతిన-కోమలినై పతిసేవయె బాయక నేజేసెదనా-యేమాయను యెరుగనట్టి యినకులపతివ్రతనైతిన
(మిత్ర) రామబాసు నేలినసావిత్రీవచ్చి బ్రోవకున్న-యెంద లకీజన్మ ఫీయే నుయీ మొండి బ్రతుకు-ఖడ్గమునా చేతబూని-ఖండించుకొనెద శిరము కాళికి అర్పణజేసెద-కాంచెద నాస్వర్గసుఖము॥ ఇం॥

తల్లీ! సావిత్రీ! నీవింత నిర్దయురాలవా? ఇక నీదయలేకున్న నాక్ జన్మమేల? ఈ తనువేల? ఇక యీ వ్రతమేల?

(అందున్న ఖడ్గము చేతబూని కాళికి నమస్కరించి)

ఉ॥ భూవిభుడైన మద్రనృపపుంగవు గర్భమునందు పొల్పుగా
దేవివరప్రసాదమున తేజముగా జనియించి నాథునిన్
సేవల దృప్తిజేసి యిక చింతల నెంతయు వంతనొందినా
నీవిపుడేలకున్న యిదె నేశిరమిచ్చెద నర్పణంబుగా॥

(ఖడ్గముపైకెత్తి హత్యజేసుకొనుటకుసిద్ధముగానుండ కాళి ప్రత్యక్షమై)

కాళి—ఆగుమాగుము. బాలా! నీసద్భక్తికి మెచ్చితిని.

(సావిత్రి చేయిపట్టుకొని)

6 చక్రవాకము—ఏక తాళము

తాళుమద్రబాలా-యిటు ప్రాణహత్యజేయమేల॥ తాళు॥ సాళ్వరాజ కోడల నీసద్భక్తికి మెచ్చితిని॥ తాళు॥ 2 మెచ్చితి నీ ధైర్యమునకు శ్రీలగు నిక చింతింపకు-వచ్చితి వరములనిచ్చెద-మచ్చకంటి శాం

తింపుము॥ తాళు॥ 3 నిశ్చయముగ నీభక్తిని స్వచ్ఛముగా దెలియ గోరి-ప్రచ్ఛన్నముగా నుంటిని-బాలా సంతోషమూయె॥ తాళు॥ 4 కాలుని సాధించగలవు-మేలగునీప్రతిమహిమ చే-బాలా నీపతిబ్రతుకును-పతివ్రతవై సౌఖ్యముగొను॥ తాళు॥ సాధ్వీమణి నీకీర్తి పృథ్వీ తలమెల్లనిండు-మిథ్యగాదు నీపురుషుని విధ్వంసమునుదప్పింపు॥ తా॥ 6 కోమలి శ్రీరామదాసుకిపి నేలేపు-దైవము యీ-భూమిని నీకీర్తి లతను వ్యాపింపగజేయునమ్మ-యిదిగో అభయ మమ్మ॥ తాళు॥

(అభయమిచ్చి కాళి అంతర్ధానమగును)

సావి:—(చేతులు జోడించి) తల్లీ! నాకింకేమి కావలయును. అంతియే నా కోరిక. ఇదే వందనంబుగొనుము.

గీ॥ సతికిపతికంటె వ్రతమేలచాలునమ్మ వరసహస్రంబునీకృపవలననాకు
పసుపుకుంకుమ నిల్పి నా ప్రాణవిభుని బ్రతుకజేయుటయే నాకు
భాగ్యమమ్మ॥

(సత్యవంతుడు కొంతదూరములో ప్రవేశించి) ఆహా! ఈ పరమ సాధ్వి దేవినిస్తుతించుచుండెను. ఈ సమయమున నేవెళ్ళిన వ్రత మంత రాయమగునేమో. (వెనుకకు తగ్గును)

సావి:—అమ్మా! నీకిదే వందనములు పదివేలు. (పళ్ళెర ములో హారతి దేవి కర్పించును)

[ప్రవేశము—సత్యవంతుడు]

సావి:—నాథా! సమయమునకు మీరును వచ్చితిరి. దేవిప్రసాదము గొనుడు.

సత్య:—కనుల నద్దుకొనును. (పళ్లెర మక్కడనుంచి యిద్దరు దేవికి నమస్కరించెదరు)

సావి:—(సత్యవంతునకు నమస్కరించును)

సత్య:—చెలీ! దేవివ్రతము పూర్తియైనదా. ఇంకనులేదా? మొక్కుబడులిట్లు చేయవలెను?

సావి:—నాథా! మీ దయవల్ల సాంగముగాజరిగి ఫలించినది. అందుచేతనే యీ దినమున ముగించితిని.

సత్య:—ఇం కేమి చేయవలయును నీవు.

సావి:—ఏమియు చేయనక్కరలేదుగాని మీ రిప్పు డెక్కడ కరుగుచుండిరి.

సత్య:—నే జెప్పవలయునా! నా వేషంబునుజూచియే స్పష్ట మగుచు. నాకేమి పనియేమి?

సావి:—అట్లయిన యీ దినం బంతయు మీ చెంతనుండి మిమ్ముల సేవించు భాగ్యము నాకనుగ్రహింపుడు. నా కోరిక దీర్పుడు. నా కదియే పదివేలు. నా కార్యము.

సత్య:—నీ కోరిక యేమియో నాకు గోచరముకాలేదు. తెలియజెప్పుము.

7 ద్వైలాగు కన్నడ—ఏకతాళము

సావి:-వినుమా ప్రాణేశ-నామనమునగల దొక్కవాంఛ॥ విను॥ మనవి జేయ మీతో నా కనుమానము దోచుచుండె-చనుపుమీర నా కోరిక దీర్చెదరని భ్రమసియుంటి॥ విను॥

సత్య:-2 ముదితా నీవాంఛ అతివేగదెల్పు రాయంచ॥ ము॥ మదికోరిక దీర్తునే మానక నెరవేర్తు-సదమలగుణగాత్రి ముద్దుమ్రోదయేశ్వరి సావిత్రీ॥ ముది॥

సావి:-3 వనముజూడ నాకెంతో వేడుకపుట్టెనుమీతో-చనిమొద యీ దినమున మీ వెనువెంటను గొనిపొండు-దినత్రయమునుండి జేయు దేవివ్రతము నేడు పండె॥ విను॥

సత్య:-4 నిద్రహారములుమాని నిష్ఠతో బహుశ్రద్ధబూని-భద్రకాళివ్రత ము జేసి బడలియుంటివీవు-ప్రొద్దువేడిసోకినంత పొలతీ ఒడలెల్ల కందు-క్షుద్రంబగు అడవిదిరుగ తెలియాఆయాసమొందు-మృదు

వగు నీ చరణయుగము మోపశక్యమా నెయ్యాదు-హృదయేశ్వరి
మీజనకుడు ఒప్పజెప్ప భద్రంబని-వృద్ధులు మా తలిదండ్రులు
ఒప్పుకొనరు-యింకొకపర మెద్దియైన గోరుకొనుముయిచ్చెద-నంతి
యెకాని॥ ముది॥

సావి:-5 ఈ దినమున మిమ్ముల నే నెడబాయుట కీలు లేదు-హాదమేల
సేజేసెడి వ్రతధర్మముగలదు-మోదముతో అత్తమామ లాదర
మున వేడుకొనెద-కాదనకను మీ వెంటక్ గొనిపోవుడునను జంట
క్రోధించకు మిమ్మెదియు గోరలేను నే నెప్పుడు-ఖేదం బెంచకు
మిది యూ భద్రకాళివ్రతమునిష్ట-నాథా నెర వేర్చుకున్న నా వ్రత
ఫలమంతేసున్న॥ విడు॥

సత్య:-మచ్చుకంటి నీభక్తికి మెచ్చితి నా మదికోరికలో అచ్చునయ్యెను
నీపై-కక్షలేదు నాకు-నిశ్చయముగ నమ్మురాళ్ల-గ్రుచ్చుకొన్న
నీకాళ్లు-హెచ్చగుబాధనిచెప్పితి నంతెగాని పెద్దలకు నచ్చజెప్పి
పోవుదమిక వచ్చుటసందియము లేదు-రక్షకరైయి శ్రీ పుట్టా రామ
దాసుదైవము నీకిచ్చినకోర్కెలు పండు-దిశ లెల్లనుకీర్తివిండు॥ మః॥

సావి:—నాథా! అట్లైన అత్తమామలకడ సెలవు పుచ్చుకొనెదను రండు. (వృద్ధాంధుల సమీపించి)

సత్య:—జననీజనకుల కిదే నమస్కారము.

సావి:—అత్తమామల కిదే వందనము.

ద్యుమ: + భద్రాం:—పుణ్యదంపతులకు జయమగుగాక. చిరంజీవులై సుఖింతురుగాక. సావిత్రీ! వ్రతము పూర్తియైనదా?

సావి:—పెద్దల కరుణారసముచే ఫలించినది. ఇక ముగించి వచ్చితిని.

భద్రాం:—అమ్మా మూడు దినంబులనుండి నిద్రాహారములు మానియుంటివి. నీ భర్త నీ ఫలహారమునకై దెచ్చియుంచిన పండ్లు భుజింపుము తల్లీ సావిత్రీ!

సావి:—అరుంధతీదర్శనము జేసినగాని భుజించుటకు వీలులేదు. దానికేమిగాని నాకొక చిన్న కోర్కెగలదు మొద్దియనిన యీ దినంబున నా పతితో అరణ్యమునకు బోయెదను సెలవిండు. ఆ వ్రతనిష్ట యేమనిన వ్రతపూర్తియైనదినంబున పతిని ఎడబాయుట వీలులేదు.

వృద్ధులు:—అమ్మా! అడవినిచాలకష్టము. అయిన నీయిష్టము వద్దనువారలమా మేము వెళ్ళిరండు. నాయనా సత్యవంతా! అతిసుకుమారి భద్రసుమా? మన పుణ్యవశమున ఆ ధర్మదేవత మనల రక్షించుటకు యీ సావిత్రికన్యకయై అవతరించెను. అమ్మా ఆలసించక త్వరితముగా వెళ్లిరండు.

8 అనుగుకీర్తన

వృద్ధు:—

జయమునగుదంపతులార-అతిరయము నరిగిరండిమీరు॥ జయ॥

2 భయముజెందక . బాహు భద్రాము సుమ్మండి-పయనాముగండీ

మీ సతిపతులు చనిరండి॥ జయ॥

3 వింతలెల్లను జూచి-కాంతారమును గాంచి-సంతోసమున మీరు

జంటాబాయాకండి॥ జయ॥

4 కూరిమితో రామదాసుదైవము మిమ్ము-సారే సారెకు బ్రోచు

సౌఖ్యాసంపదలిచ్చు॥ జయ॥

సౌఖ్యముగా నరిగి త్వరితముగారండి.(వృద్ధులునిష్క్రమింతురు)

సత్య:—చెలియా! ఈ త్రోవ పదిలముగానడచిరమ్మా. అడవి చిత్రములు జూపెద.

సావి:—నాథా! మీ వెంటనేవచ్చుచుంటిని. మెల్లగానడువుడు.

# సా వి త్రీ వి జ య ము

సత్య:—కాంతా! నే జూపిన చిత్రములన్నియు చక్కగా పరిశీలించుము. అదిగో ఆ పొదపై ప్రాకియున్న లతలను జూచితివా! ఎంత సొగసుగానుండెనో!

9 జైలాగు సావేరి—ఏక తాళము

సత్య:-చూచితివా చెలియ-ఈ కాంతారము సొగసెల్లను॥ చూ॥ పూసిన
యావిరులసొంపు వాసన బహు పసిమి యింపు-గ్రోసెడి తుమ్మెదల
గుంపు-జేసెడిఆఘ్రాణింపు॥ చూ॥

సావి:—ప్రాణనాథా! ఇటుజూడుము. ఆహా! ఈ వనంబున ఎట్టి చిత్రంబు లుండెను!

2 కనుమల్లెనాథా-నా మనమున కానందమాయెను॥ కను॥ వన
ముకు మీ వెంటనేను వచ్చినట్లు చూడుమింట-చనుచుండెను
మగని వెంట-కనుగొను పక్షులజంట అనుమానంబేలనుదా నాలి
బోవుమగని వెంట-నినువిడచియు నేను బ్రతికనుండ నేలనమునయింట॥

సత్య:—నీ వెప్పుడు యిట్టి మాటయే యాడెదవుగాని యీ ప్రక్కకు జూడుము.

3 రమ్మా చెలి యిటుజూడు-కొమ్మ-కొమ్మ-రావులాడి కొంపలు
కాలెడిరీతి గమ్మునమందుచువిరిగి-దుమ్ము రేగి అడవెల్లను-క్రమ్ము
చుండె-వేగముగా-రమ్ము రమ్ము తడవాయెను-రయమునబోదము
దూరము॥ చూ॥ (త్వరగా నడచెదరు)

సావి:—నాథా! ఇటుజూడుము. ఆ పొదలలో చిత్రము.

4 వృద్ధులు నీ తలిదండ్రుల వద్దను మన మిద్దరము-ముద్దుజూపి
నట్లుగ యానిద్రజెందుపిల్లల నతి భద్రముగా కాపాడుచు-ముద్దిడు
చుండెనుపొదలో పెద్దపులులబుద్ధిజూడు-వృద్ధంధుల విడచియిందు
వచ్చినాము-మన కెంతో ప్రొద్దుబోవుచుండె పండ్లుగోయు డింటి
కేగుదము॥ కను॥

సత్య:—ప్రాణసఖి! ఈ తావు వీక్షించితివా? నే ప్రతిదినమును వచ్చెడి వన మిదియేసుమీ!

5 ప్రతిదినమును మా జనకునికి హితవని తెచ్చెడి పండ్లివి-సతతము నేవంట చెఱకు గొట్టి తెచ్చు చెట్లివి-సతినీ వెఱ్ఱూను జేసెను సావిత్రీ పూజకు నే నతిమోదముతో దెచ్చెడు తామరపువ్వులీ కొలనువి-హృదయేశ్వరి అడవి నెన్నో యుండెను-బహుచిత్రములు నవ్వు మింత జూపెదను నీమది కానందముగా॥ చూ॥

సావి:—నాథా! ఇది ఏమివింత మన కిక్కడినే సూర్యుడస్తమించు వేళాయెను. వింతలసందడిని మన యిల్లుమరచితిమి. ఇక చిత్రముల కేమిగాని పనిజూతము.

6 ప్రొద్దుపోయెను మన పెద్దలు-వృద్ధాంధులు మనమిక అశ్రద్ధ జేయరాదు సూర్యుడస్తమించు వేళాయెను కొన్నిపండ్లు గోయుడిక ను-కోపింతురు తలిదండ్రులు ప్రొద్దుట సావిత్రీపూజ పూర్తిగ జేసితి పువ్వులు-కొద్దిగ కావలెను రాను కివినేలను భద్రకాళి నిద్దరము పూజింతము వేగమిల్లు చేరెదము॥ కను॥

సత్య:—(విపరీతముగా నటించును. పండ్లుకోసి రాసులుగా బోయును. చెట్టెక్కి పుల్లలుగొట్ట ప్రారంభించి కొట్టి దిగివచ్చును)

సావి:—నాథా! మనకుచాలతడవాయెను. ఇంటికేగుదమురండు.

సత్య:—చెలీ! ఏమియోకాని నాతల భారముగా నోచు చుండెను.

సావి:—నాథా! సూర్యుం డస్తమించుచుండెను. ఏమి యీ విపరీతచేష్టలు మానిరండి.

సత్య:—అయ్యో! మరచితిని. కాళిపూజకుపువ్వులుకోయలేదు (వేగముగాకొలనులోదిగి పువ్వులుగోయుచు, తలచేతబట్టి వచ్చికూర్చును) హా ప్రాణేశ్వరీ! నిలువజాలను. (అని సాగిలంబడును)

సావి:—ప్రాణేశ్వరా! ఏమది యింతలోనే తలనొప్పి. ఏమి హేతువచేతనోకదా! (కొందరగాదరికేగి) నాథా! ఏమీయుపద్రవము.

సత్య:—(లేచి కూర్చొని) హా ప్రేయసీ! హా ప్రాణసఖీ! హా పరమేశ్వరా! హా చెలీ!

గీ॥ శిరముపై కోచె నద్దియో చెనటిబాధ బ్రద్దలౌచుండె నెత్తిపై బాదినట్లు
భారమెంతయు మొగ్గనోపగ నేతి నాకు నిలువజాలను నేనొక్క నిమిషమైన॥

10 శోకావళి—చాపుతాళము

నిలువజాల నింతి నాతల గాఢనిశ్శంబాయెను॥ నిలు॥ చలియించెను
మేనెల్లను ఝల్లుమనియెనే మొకాని॥ నిలు॥ కొలనుకేగి నేపువ్వులు
గోయుచుండునంతలోన చలివచ్చెనదేమొగాని కరచరణములొణక
జొచ్చె-పలువిధబాధలుదోచెను భగవన్మాయెట్లున్నదో॥ నిలు॥
2 అమ్మమ్మా శిరముపైన సమ్మెటతో గొట్టినట్లు-దిమ్మెత్తెను
అబ్బా యెముకలమ్ము బరువుగా దోచెను-సొమ్మసిల్లె ప్రాణమింక
చెలియా నేనెట్లోర్చెద॥ నిలు॥ 3 భయముతోచె నేనింకా-బ్రతికె
దనా యీబాధకు-అయ్యయ్యో తలిదండ్రులనాదరించువారలెవరు-
ఇయ్యెడ నేమృతిజెందగ-యేమౌదురో వృద్ధాంధులు-నెయ్యంబుగ
వారినింక మోదార్పగదిక్కెవ్వరు-యివ్విధినానార్తవిన్న యిప్పుడె
ప్రాణము విడతురు-అయ్యయ్యో నేనెంతటి అన్యాయము గట్టు
కొంటి॥ నిలు॥ 4 అక్కటకట నీకింకను దిక్కెవ్వరు ప్రాణసఖి-
దిక్కులు పాలించువారి లెక్కగొనక నన్నుగోరి-మిక్కుటమగు
యడవిజేరి-దుఃఖము నొందగ నావిధి-నిక్కముగా వ్రాసెనేమొ-
చక్కని ముద్దులకుమ్మా-సరె నేమో మన ఋణమ్ము-మ్రొక్కెద
శ్రీరామదాసునేలెడిదైవము నీవేదిక్కని నమ్మితి సుమ్మా-దీనుని
బ్రోవగరమ్మా-దుఃఖములో మునిగియుంటి-దోసిలొగ్గి వేడుచుంటి॥ ని॥

హా! పరమేశ్వరా! అమ్మా! అమ్మా! హా ప్రాణసఖి! హా చెలీ! నాబాధ యేమని చెప్పువాడ. శిరమెంతయో బాధ. ఇక నిలువజాలను.

(వెనుకకు పడిపోవును)

సావి:—(సత్యవంతుని శిరము తనతొడలపై జేర్చి) నాథా! అట్లనుచుంటిరేమి? తగ్గలేదా?

సత్య:—హా! దైవమా! హా! జననీజనకులారా! హా! ప్రేయసీ! ప్రేయసీ! హా! ప్రేయసీ! హా! విధీ!

సావి:—నాథా! అట్లనుచుంటిరేమి? కలువరించుచుంటిరా? నేనిచెంతనే యుంటిని.

సత్య:—

ఉ॥ భారము నిల్వజాలనిక ప్రాణము పోవుచునుండె మీకు నా
ధారము లేదు ప్రాణసఖి! దైవము మిమ్మిట్లు జేయనెంచెనో
నీరజనేత్రిరో ఋణము నేటికి దీరెను మీకునాకు హా!
క్రూరుడనైతి మిమ్మిటుల ఘోరవనంబున బెట్టి పోవగా॥

సావి:—నాథా! అట్లనుచుంటిరేమి? ఇంకను మీతలబాధ శాంతించలేదా? ఎట్లున్నది?

11 కాంభోజి—ఆదితాళము

శాంతించినదా నాథా-చాల వింతాయెను మీశిరస్సుబాధా॥ శాం॥
ఇంతలోనె యిటు హెచ్చిపోయె-నీ కాంతారంబున కేలవచ్చితిమి॥ శాం॥
2 సంతోషముతో వింతలుజూపుచు-కాంతారమ్మని చెంతజేర్చ
మనమెంతో వేగము నింటికేగ బల్ వేడుకతో నేనుంటిగాని మీకింత
లోనె యిటు కష్టంబెటుగను నాథా॥ శాం॥ 3 కారణమేమో తెలియ
కుండె నీదారినడచునపు డేదియైనను-క్రూరసర్ప మేకాలుపట్టెనా-
ఘోరఘాతము గానరాదు యిక-యేరీతిని పాల్పోదు నామదికి-

నాథా॥ శాం॥ 4 అల్లనాడు యీ మానిపల్కులు-కల్లలనుచు నే తల్లిదండ్రుల-నెల్ల చాలగా తూలనాడినా-దిపుడునాకు జ్ఞప్తికివచ్చె హా-కొల్లలుగా మ్రొక్కుచుంటి-మాకుల వేల్పుభద్రకాళి బ్రోవరావే-నల్లనయ్య రామదాసువరదా-నానాథుని బాధమాన్పవా నాథా॥ శాం॥

నాథా! పలుకవేమి! తగ్గినదా? హా! ప్రాణేశ్వరా!

సత్య:—

గీ॥ నోటతడి లేదు నాకింక మాటరాదు బ్రతుకు లేదింక నాపైని భ్రాంతి నీదు
బాసిపోవుచుండె నా ప్రాణమిపుడు గావనెవ్వరు లేరయ్యె కాననమున॥

హా! ప్రాణసఖీ! ఇక నేను బ్రతుకను. హా! ప్రేయసీ! ప్రేయసీ! ప్రేయసీ! హా దైవమా! హా జనకా! హా తల్లీ! హా రామా! హా దైవమా! (సత్యవంతుడు మాట్లాడకుండ కన్నులుమూసి యూరకుండును. సావిత్రి సత్యవంతుని శరీరంబంతయు తడిమిచూచి) అయ్యో నాథా! పలుకరేమి? హా ప్రాణేశా! (సత్యవంతునిపై చెయ్యివేసి) నాథా! నాథా! అయ్యో నాథా! పలుకరేమి? నిద్రపట్టినదా! అయ్యో! మాట్లాడరేమి? నాపై కోపమా! ఈ తుచ్ఛురాలి మొరాలించరా! కన్నెత్తిచూడరా! హా ప్రాణేశా! ఒక్కసారి మాట్లాడరా! నన్నిట్టి మహారణ్యమధ్యంబున విడచి పోయెదరా! మీకీ యకాల మృత్యువవలె యీతలనొప్పి సంభవించెనా! అయ్యో జీవితేశ! నన్నిట్లు జేయుట భావ్యమా! నన్నన్యాయము జేయుట మీకు న్యాయమా! నిత్యము మీసేవ జేయుదానను మీ మృదువాక్యము వినుటకు నోచుకొనలేదా!

12 మోహన—రూపకతాళము

పలుకరేమి ప్రాణనాథ-తలభారము తగ్గలేద॥పలు॥ కలకలనవ్వెడు మోము-కాంతిదరిగెనిటు దీనతవిలపించెడు నన్నుజూచి యింతయు కనికరంబులేద॥ పలు॥ 2 మునిదీవన వ్యర్థమయ్యె-మృత్యువశసన్న

నీవులేని నేనొంటి నెట్లు జీవించుదానను! హా భూతదయామయా! యీశోకవార్ధినుండి తేల్చవా! ఒక్కసారిపల్కరా! కన్నెత్తిచూడరా! మాశదిన్యాయమమా! నాకిక దిక్కెవ్వరు? హా సకల చరాచరప్రపంచ మంత యింత రక్షణహీన మయ్యెనా మనోహరా!

13 కల్యాణి—చాపు తాళము

సా:-అక్కటకటనేనెంతటి దిక్కుమాలినపక్షినైతి॥ అ॥ నిక్కముగా నా నాథుని కిక్కడ మృతిగాబోలును॥ అ॥ మిక్కుటమగు యీయడ విని-దుఃఖజలధి నన్ను ముంచి-చక్కని నాప్రాణేశున కిక్కడమృతి సంభవించె-దిక్పాలకులార మీరు దీనురాలిమొరవినరా-ప్రేముకెక్కడ నాజీవి తేశు రక్షించరసురులారా॥ అ॥ 2 సతపతులకు సంతోషము సగమైననుదీర లేదు॥ స॥ బ్రతుకుననుచుశోచను-నా మది కేమియు పాల్పోవ ధృతిమారెను నేత్రంబులు నశ్రువులుండియూరిబడెను-అతు లిత యీ సౌందర్యము అంతకంతకును తరిగెను-రత్నంబులబోలెడి యీ పలువరుసము నల్లబడెను-గతిలేదిక నానాథుని గాచువార లెవ్వరికను-హాతివిధితప్పింపవశమహానిన్నైననుగావవ॥ అ॥ 3 మద్రదే శునిపుత్రిని యీసాళ్వపతికి-కోడలనై॥ మ॥ పితృమాతృభక్తుం డగు సత్యవంతునకుసతినై క్షుద్రంబగుకారిడవిని దుఃఖమొందు చుంటినేను-మత్తేభములారా నా మానధనుని గాపాడర-ఆర్తివినర మీరలైన హరిశార్దూలంబులార-తరులారా గిరులారా దయజూడర మీరలైన-వనదేవతలారా నా వల్లభు భిక్షంబిడరా॥ అ॥ 4 రక్షిం చరజీవితేశు భిక్షమొసగి కాపాడర॥ ర॥ యక్షులార సిద్ధులార సా ధ్యులారమీరలైన-పక్షీంద్రములార రారె భద్రకాళి బ్రోవరావె యిచ్చటనిపుబ్రోవకున్న యెవ్వరి నే వేడుకొందు-వచ్చిబ్రోవు రామ దాసువరదా దయరాదా నే స్వచ్ఛముగా నిన్నేమది స్మరియించితి భక్తాళి॥ అక్క॥

హా! ఎవ్వరూ గానరారు. ఇక నేమి జేయుదానను. హా! జీవితేశ్వరా! హా నాథా! రక్షింపవా! హా ప్రాణేశ్వరా (యని మూర్ఛబోవును)

[ప్రవేశము — శాంతరూపముతో యముడు]

యముడు:— ఆహా! ఈ దిక్పాలురు పాలించువారలలో ధైర్యంబున నన్ను మించినవారు లేరనియు యీ కఠినశిక్షలు జేయ ప్రత్యేకముగా ఆ నలువ నన్ను నియమించెను. కావున నా పేరు విన్నమాత్రంబున సకలజీవులు భయంబున తల్లడిల్లుచుండుటయేగాక ప్రాణంబులు చేతబట్టి పరుగులెత్తరే. ఔరా! నా మహిమబొగడతరమే! కటికి రాతికైనను చలనముండునుగాని నా మనస్సు చలించునే.

గీ॥ పరగ మహిమంబునెక్కి యీ భానుసుతుండు పాశమును చేత
బూనగ వసుధలోన
ప్రాణములు చేతబట్టుక పరుగులిడరె మూఁక వెనువెంట యుందురే సూరులైన॥

ఉ॥ భీతిగలంగఁగాఁ జనవులు భీకరరూపము జూచినంత నే
పాతకులైన నట్టి దలచి పాపపు కార్యము జేయనేర్తురే
ధాత విధించె నన్నిట్టుల దండధరుండని పేరుబెట్టి ప్ర
ఖ్యాతివహించితీభువిని కాలునితో సరివారలుండిరే॥

నే నిప్పుడే త్వరితముగాబోయెద. (కొంతదూరమునడచి ఆశ్చర్యముతో నిలువంబడి) ఆహా! ఏమి నా మదికి ఆశ్చర్యముగా దోచుచుండెను. ఈ చిత్రమేమి! ఎన్నడు నిట్టివింత జూడలేదే! నా కిట్టి అద్భుతమహిమ పొడగాంచినది. ఏమికారణమోకదా! (పరికించి) హా తేటపడినది. ఈ పతివ్రతామహాత్మ్యమై యుండవలయును. ఆహా! పరమసాధ్వి. ఔరా! జాలియనునది యెట్టిదో యెరుంగని యీ కాలుని మేనెల్ల చలించెను. నడచుటకు నా కాళ్ళాడుటలేదు. ఏమియాలోచన. దరిచేరుటకే శక్యముగాకున్నది. బళే! ఈ పరమసాధ్వి నెంతయుగాని యాడను. ఈమె పతిభక్తికి నా ధైర్యమెగ్గబోయెనే యింకొకటననేల!

సీ॥ కటికిరాతినిబోలుకాలునిహృదయంబుకరుచుచుండగనేమి కారణంబో
చటులస్వభావుడౌ జమునిమనంబున జాలిజనించె నీ లీలయేమొ
బ్రహ్మాండమెల్లను భయమునొందించెడు భానుసుతునకు చాల
భయముదోచె
ధైర్యంబువీడునని దండధరునికిప్డు సాహసమెల్లను సన్నగిల్లె
గీ॥నహహ యేమిదిచిత్రమీయబలవనుహిమ నాకుజెన్నను నాకిప్పుడెంతొ
వింతగొల్పుచుండెనుజీవముల్ గొనగనేను దరికి జేరుటకేదిగల్ దట్టుచుండె
ఆహా! ఏమి మనంబున భీతికూడ జనించుచున్నదే. పూర్వపరా
భవము యిప్పుడు జ్ఞప్తికివచ్చుచున్నది. ఏమి యీ చిత్రము!
గీ॥ తొల్లి మార్కండుజీవముల్ గొలుగనేను ఫాలనేత్రుడుమనన్ చాల
భంగపుచ్చె
మరలసావిత్రిశాధర్మమహిమవలననిప్డు నాకిటి దుమకుల నెట్లుగొందు॥
ఇంకేమి జేయువాడ. ఈ పరమసాధ్వియొక్క మహిమజూడగా
మరియును—
సీ॥ సరగునసావిత్రి జఠరాగ్ని వేడికి కాలుడ నాశివెన్న గఱగిపోయె
పరమసాధ్వియనెడి భానునికాంతిచేహరియనుహిమగిరికరుగదొడగె
సత్యవంతునిసతిసాధుప్రభావముల్ శమనునిహృదయంబుచలనపఱచె
పతిభక్తిచేనొప్పు బాలనుగాంచిన దాడధరునిగుండె దద్దరిల్లె
గీ॥ తివిరినే వీనిజీవముల్ దీయుటెట్లు తొడలపై జేర్చెదానినీ తోయజాక్షి
దరికిబోవుటకింక నాతరముగాదు యేమిజరుగగనున్నదోయీదినంబు॥
ఏమియాలోచన. ఇక లేనికోపము దెచ్చుకొని జడిపించెద.
లేదా లోకధర్మముల నెరింగించి మంచిమాటలచే జీవంబులు దీసు
కొనెదను.

14 కాంభోజి—ఆదితాళము

యము:—
ఆహా యిదియేమాశ్చర్యంబో సాహసమెల్లబోయె సన్నగిల్లెనుధృతి॥
2 ఓహహో హోయీవనితనుజూడగ నెమహాద్భుతంబై మనసుచలించెను॥

3 అన్నన్నా యీశక్తి మహాత్మ్యమే యొకన్నులజూడగా నెగసగెను హృదయము॥ ఆ॥ 4 పేరుజెప్పినజనుల భీతిల్ల జేసెడు శూరుడనగు నేనీ నాతిచే నోడితిని॥ ఆ॥ 5 జాలిసేయక్కటి యీ కాలుని మనసెల్ల-అనలమునుపోకిన ననసీతనూ మెను॥ ఆ॥ 6 కపటదైన్యముబూని కాలపాశముగొని-యిప్పుడు నే జీవముల తెత్తుగా పోయెద॥ ఆ॥ 7 భీకర రూపుదాల్చి కోకిలనాతిగాంచి-లోకధర్మము చెల్ప జేకొందు జీవాము 8 ధరణిలో నీవు నాడు నరదుని మూర్జ దాటతరమా యన్వారికైన త్యాగన నే బోయెద॥ ఆ॥

యముడు:—(సావిత్రిని సమీపించును)

సావి:—(లేచి దిక్కులు పరికించి) హా దేవుడా! ఈ ప్రదేశమెల్ల అంధకారబంధురమ్మై దోచుచున్నది. కారణమేమి? హా ప్రాణేశ్వరా! కటకటా! నా జీవితేశ్వరుడు, నా భాగ్యలక్ష్మి, నా యర్థశరీరము, నా రత్నాలమూట, నా బంగారుబొమ్మ, నా ప్రాణప్రియుడు నన్నెడబాసి పోవుటను విచారమే యిట్లంధకారమై దోచుచున్నది. నన్ను దుఃఖసముద్రంబున ముంచినది. (ప్రక్కలకు పరికించి) హా ఏమిది! యీ సమీపంబున గాన్పించెడు యీ భీకరాకారమేమి. హా జీవితేశ్వరా! నా దుఃఖమును దొలగింపవా, నన్ను రక్షించవా, కాపాడవా, నను బ్రతికింపవా, నా కష్టమును యెడబాపవా! హా హృదయేశ్వరా! నాథా! హా నాథా! (అని మూర్ఛిల్లును)

యము:—(తనలో) యీ పరమసాధ్వి నన్ను వీక్షించినది కానిమ్ము ఇక నా యత్నము జూచుకొనెదను.

సావి:—(మరలలేచి) యముని జూచి నా పాలి దైవమువలె ఎవ్వరో ఒక మహానుభావుడు నా మొరాలించి వచ్చెను. (ప్రకాశముగా) అయ్యా! మీ రెవ్వరు? ఈ దీనురాలి మొరాలింపరా, రక్షింపరా, నా నాథుని బ్రతికింపరా?

యము:—సాధ్వీమణీ! నన్ను నీవు మెప్పించు మాటయింక లేదు. నిన్ను రక్షించుట నా వశముగాదు. నేను దక్షిణదిశనేలు యముడను నాగారాకిశుడను. నీ నాథుని జీవంబు లిక దక్కవు. ఈ నరులు అల్పజీవులు. మృత్యువును గెలుచుట కెవరికిని శక్యము గాదు. నీ విలపించిన కార్యముగాదు. నీ పతిపై నాశవిడచి యింటి కేగుము. పుట్టినవారు గిట్టుట గాక యెప్పుడు బ్రతికియుందురా? ప్రపంచధర్మము నీవు మఱచుండితేదా! ఇక నీ దుఃఖముడుగుము. బాలా! నా మాట వినుము.

సావి:—అయ్యో దైవమా! నా పాలి మృత్యుదేవత వలె కాలుడు గూడ ప్రాపించెనా! ఇంకేటి మార్గ. అయ్యో ప్రాణేశ్వరా! అగ్నిసాక్షిగ పెండ్లాడి నన్ను త్యాగము జేసెదరా! నే నేమిచేయు దానను. అయిన ధర్మస్వరూపుడైన కాలుని వేడుకొందును.

15 శైలాకు, నాథనామక్రియ—ఆదితాళము

సావి:-దక్షిణదిక్పాలా-పతిభిక్షమొసగి కృపజూపుచాలా॥ దక్షి॥ రక్షించుము యీ నీదు దాసిపై కక్షబూన భావ్యమగునా కాలావృక్షం బిడచిన పక్షికీతి నా విభునినన్ను యెడబాపుట మేలా॥ దక్షి॥

యము:-2 చాలునుపో బాలా-నీకిది మేలాగుణశీలా॥ చాల్ చాలునపో॥ జాలిలేని నాతనంమ నాకిటు-కాలుడంచు నాను మెచ్చేరబలా-వీలుగాదు నీ మగనిజీవము-లివ్వమనుట మేలా నీదుపల్కులు-చాలుతెమ్ము వేగబొమ్ము యింటికి॥ చాలు॥

సావి:-3 ధర్మమూర్తివీవు అధర్మముజేసెదవా॥ ధ॥ పరమపురుష నా పతి యేకర్మార-కర్మమెపుడు జేసియుండలేదు-మర్మమేలనింకవిడచి పెట్టుము-దుర్మార్గంబున కొడిగట్టకుమా॥ ధర్మ॥

యము:-4 అజునిబ్రాతఫలముదాటగ యోజనులకువశమా॥ అ॥ సుద నువైన నీ ప్రాణనాథుని-త్యజించుము యిదిగో లోకధర్మము-

నిజమునమ్మ-మాటవినుము-యీ భువి-ప్రజలనెల్ల జూడలేద నీవు॥ అజా॥

సావి:-5 దిక్కులేనిదానా నీకిదె మ్రొక్కుచుంటి శమనా॥ దీ॥ అక్కటకట నా దుఃఖము ఎంచకు-నిక్కముగా పతిదిక్కు వేరెవరు-చిక్కనైన నజపతేగుపశువ్రము-జాలిగనుము-ఆలిమగలసలుపుము॥

యము:-6 ఎంత జెప్పిన వినకా యితడు అంతకుడనిగనకా॥ యెం॥ ఇంత ముతో యిటుభీతిలేక నా కాంతునివ్వమను యిబల్కుచుంటివి-కాంతనీ పతిభక్తి మెచ్చి యీ అంతరాళమందు గానవచ్చితి-వంతమాను ధైర్యయీను నే నిగమాంతకుండ-చూడు పతిని వీడుమా॥ యెం॥

యము:—(అంతర్ధానుండై కానరాకుండును)

సావి:—హా యిది యేమి వింత! కాలుం డదృశ్యుడై కానరాకుండెను. హా దైవమా! ఏది తెరవు. ఎవ్వరుదిక్కు. ఏమియాలోచన. హా జననీ సావిత్రి! నన్ను రక్షింపవా! నీ వంత కఠినహృదయవా! ఇంత నిర్దయువా? నీ వరము లసత్యమా? మునిదపన నెల్లలాయెనా? హా నాథా! జననీ దుర్గాంబా!

7 దీనజనావరదా నీవు-నా మొరవినరాదా॥ దీ॥ కోమలాంగినైన నన్ను గావవ నా మనోహరుని జీవమొసగవా-యేమిసేతు యెవరుదిక్కు నాకిక-సావిత్రీ బ్రోవసమయ మొచ్చెను॥ దీ॥

అయ్యో! ఎవ్వరు గానరారు. హా జీవితేశ్వరా! హా అర్ధశరీరా! హా సత్యవంతా! నీవు లేని నామేన ప్రాణము నిలచునా? హా దుర్గాంబా! నన్ను కాపాడవా? హా మానధనా నీవు లేనిదీ సౌఖ్యమేల! ఈ దేహమేల నిన్ను విడువగలనా! నీవు నన్నెడబాయుట న్యాయమా! ఇది నీకు ధర్మమా యిక నాకు బ్రతుకేల నీతో నేనును వచ్చెదను. హా నాథా (యని మూర్ఛిల్లును)

యము:—(ప్రవేశించి) ఆహా! సావిత్రి మూర్ఛపొందెను. నా కిదియే సమయము. ఆ సాధ్వీమణి లేవకమునుపే నాపని జూచుకొనెద. త్వరితముగా జీవంబులు గొని యిచ్చట విడచి వేగముగా బోయెద. కాలయాపనంబౌచుండెను.

8 పాశముచేబూని జీవము దీసుకిపోయెదనూ॥ పా॥ లేశమైన ఆలస్య మెంచకను బోనెద నిచ్చోటవిడచి నాకాయీనపడిచ్చు ఆజ్ఞతప్పనశమా భాసురమతి రామదాసవరదుని మాటదప్ప పాటిగాదనాకూ॥ పా॥ (జీవంబులు దీసుకొని-నడచుచుండును-యముడు)

సావి:—(లేచి) అయ్యో! ఇంకను బ్రతికియుంటిని. హా నాథా! నాజీవము విడువదేమి! అయ్యో పరమేశ్వరా రక్షింపవా! (సత్యవంతుని శరీరమెల్ల పట్టిచూచి) అయ్యో! దేహమెల్ల కొయ్యవలెనుండెను. ఊపిరికూడ ఆడుటలేదే! అయ్యో నాథా! నను విడచిపోతిరా (దిక్కులు పరికించును) యముడు నడచుచుండును. హా దైవమా! సావిత్రీ!

16 మలయమారుతం—ఏకతాళము

సావి:-పోవుచున్నాడే-నా జీవితేశునియుసురులుగొని॥ పో॥ జీవహింస జేయ ఘోరపాపంబని చింతింపక-త్రోవనడచుచుండెనేను దిక్కుమాలినదాననైతి॥ పో॥ 2 మహిషవాహనుడునాపై యిసుమంతయు జాలిలేక-కసుగాయలమని యెంచక కాంతునినన్నెడబాపి॥ పో॥ 3 మోసపుచ్చి ప్రాణేశుని పాశముచే బంధించి-లేశమంత కరుణలేక నా పసుపుకుంకుమగొని॥ పో॥ 4 అక్కటకట నాకింకను దిక్కెవ్వరు లేరటంచు-మ్రొక్కివేడుకొన్న వినక దుఃఖజలధి నన్నుముంచి॥ పో॥ 5 తల్లిదండ్రిమాటవినక ధనమెంతయు లెక్కగొనక-వల్లభుతోగూడియుండ-వనమున జోడెడబాపి॥పో॥ 6 ఖగమృగంబులార మీరు కాంతునిగాపాడరార-పగబూనెను దండధరుడు ప్రాణేశునిదీసుకొని॥ పో॥ 7 అంగనధనమపహరించు-

దొంగవానివలెనెవచ్చి-భంగపుచ్చి కాలుచు నామంగళసూత్రంబు గొని॥ పో॥ 8 హరులారా గజములార-ఆ ర్తివినరమీర లైన-తరు లారా గిరులారా దండధరునిదప్పింపర॥ పో॥ 9 యక్షులార నా నాథుని రక్షించరమీరలైన కక్షుబూని నా పతిని దక్షణదిక్కా లుచుగొని॥ పో॥ 10 మునిదీవనవ్యర్థమాయె-కనుగొననిది చిత్ర మాయె-అనుమానంబేనింక చనియెద నా కాలువెంట॥ పో॥ 11 సాధుశవముగాపాడర సాధువులారా మీరు-పాదంబులుబట్టి యముని-పతిజీవము దెచ్చుకొనెద॥ పో॥ 12 భానుసుతుడు కృూరుండై ప్రాణంబుకొనిగట్టెను-దీనురాలి మొరవిను శ్రీరామ దాసకవిపాల॥ పో॥

(నలుదిక్కులు పరకించి చూచి) హా దైవమా! యేది తెరవు! కష్టకాలంబున దైవసేవయేగదా కర్తవ్యము. నే నిక ధైర్యమువలం బించి ఆ భగవంతుని ప్రార్థించెదగాక. ఓ పరాత్పరా! పిపీలికాది బ్రహ్మపర్యంతంబు నీవు రక్షించువాడవు, ఆధారభూతుడవు, దయా మయుండవు నన్నొక్కదాని రక్షించుటకు నీకు బరువాయెనా! ఆర్త రక్షణబిరుదాంకితుడ వగు నీవు యిట్లు నిర్దయబూన నే నేమిచేయు దానను. ఆపద్బాంధవా! అఖిలలోకరక్షా! నన్నీ దుఃఖాబ్ధినుండి తేల్పవా? ఓ సూర్యచంద్రులారా! ఓ తారలారా! ఓ పంచభూతము లారా! నన్నేకాకినిగావింపక నా మనోహరుని రక్షింపుడు. ఓ గరుడ గంధర్వాది యక్ష సిద్ధ సాధ్యులారా! మీరలైన యీ దాసురాలి మొరాలింపుడు. నన్ను రక్షింపుడు. ఈ మహారణ్యమధ్యంబున నా ప్రాణనాథుని కళేబరము మీ కప్పగింపుచున్నదానను. నా యందు దయవహించి కాపాడుడు. నే నిదే పోవుచుంటిని. (నడువప్రారం భించును) (చీకటి అంధకారమై యేమియు కాన్పింపకుండును) ఆహా! ఏమిది! నే నెంతమోసపోయితిని. నారదునిపల్కులు మరచి యముని

విడచితిని. మూర్ఖతలోబడి విలపించుచుంటిని. ఇక గతించినదానికి చింతించిన ప్రయోజనంబేమి! ధైర్యమే తోడునీడ. తల్లీ సావిత్రీ! నీవేదిక్కు. (చేతులుజోడించి) ఓ పంచభూతములారా!

గీ॥ కాళిమహిమను విలసిల్లగలుగుదేని అంబమనుగాచిరక్షించునట్టిదైన
కటికిచీకటియైన యీకాననమున శమనుడున్నట్టితెరికి నేసరగజనుదు

(అంధకారముమారి యముని వెనుక నడచుచుండును)

ఓ ధర్మరాజా! నన్నిట్లుమోసపుచ్చిరాతగునే నిలువుము నిలువుము?

యము:—(దిక్కులుపరికించి) హా యేమి! ఈ సతీలలామ సాహసము! ఔరా! సుంతైన భయములేక అగమ్యమార్గంబని యెంచక నా వెంట వచ్చుచున్నది. ఏమిచేయువాడ! (ఆలోచించి) రానిమ్ము ప్రియవచనంబులచే యీమెను వారించెదగాక. (ఆమె సమీపించుచుండును. యముడు నిలచును)

సావి:—ఓ ధర్మమూర్తీ! నాపై కరుణవహింపవా! నను రక్షించి పతిభిక్షం బిడి నన్ను కాపాడవా! మా ప్రేమానురాగంబు బాపుట నీకు భావ్యమా! నా మొరాలించవా!

యము:—సావిత్రీ! ఇది యేమి వింత! ప్రపంచధర్మము నీకు తెలియదా యేమి?

ఉ॥ అచ్చెరువయ్యె నిన్నుగన హా భువి మానవులెల్ల పుట్టుచుం
జచ్చుటజూచుచుండి యిక చావకమానెదు దానిభంగి నీ
వచ్చినవానికేడ్చెదవు చాలును నీమగడింక రాడు నీ
వచ్చినదారి పట్టుమిక వారిజనేత్రిరో యింటికేగుమా॥

అయినను యిక నాతో వచ్చుటకు నీకేకాదు. ఎవ్వరికైనను శక్యమా! ఇంతవరకు నీకు తెలియక వచ్చితివి. ఇక నీ వెఱ్ఱిభ్రమయే కాని నీ భర్త బ్రతుకడు. నీవు బోయి నీ పతి అనంతరక్రియలు నెరవేర్చుకొనుము. ఇక ముందుబోవునది అసాధ్యమార్గము. నాకుతప్ప ఎవ్వరు రాజాలరు

సీ॥ కాలు మోపగ రానికంటకంబులుశిలల్ గాఢాంధకారమహాకాననములు
బుస్సుబుస్సనుచును బుసకొట్టుచునునిటక్రూరసర్పములుండుకోట్లకొలది
గర్జించినంతనే కడుభీతిజనియించు హరికరిశార్దూల శరభతతులు
కొండలపైనుండి ఘోరంబుగా బారు సెలయేళ్ళదాటగ చేతనౌనె
గీ॥ పట్టజాలనికష్టము లట్టిదగులుసుంతనంబులుగావు నామాటవినుము
యింటికేగుము నీవిభుడింక రాడు నమ్ము నామాట సావిత్రి నళినసేత్రి॥
సావి:—ఓ ధర్మరాజా! నే నింటికేగి యేమిచేయుదానను నా
పతి లేనిది నాకు సౌఖ్యమేల?
గీ॥ సతికిపతిసేవ యేగదా సద్వ్రతంబు వనితలకు నాథుడేగదా వైభవంబు
పుణ్యపురుషుడు లేనట్టిభోగమేల భయమదేలను నాకింక పరమపురుష॥
ఓ సూర్యపుత్రా! నీవు జేయు బోధయంతయు నే నెరుంగుదును.
ఉ॥ నీతులుదెల్ప నేలనిక నే నిటు దుఃఖము బొందజాల నా
వ్రాతయిటుండెనో నుదుట వాంఛనువీడితినింక నాకు నీ
పాతకజన్మమేల నిక ప్రాణపదంబగు నాథు బాసి నక్
వాతపుపైత్యదేహమిక వద్దిల సార్థకమేమిజెప్పుమా॥
దయాస్వరూపుండవగు నీవు యింత నిర్దయబూనుట భావ్యమా!
శా॥ ఎంతో రాజ్యముగల్గు భూపతులలో నేనేరిజూపించి యో
కాంతా నీతగువాని గోరుమనగా కాదంచు నేబల్కి యీ
కాంతారంబున నున్నవాని మదిలో కాంక్షించి పెండ్లాడియున్
సంతోషాంబుధి మున్గియున్న మము హా సంతాపముల్ బెట్టవే

17 బైలాగు, జంగ్లా—ఆదితాళము

సావి:-శమనాయిదిన్యాయమేనా-నా మనోహరునిగొన॥ శమ॥ శశికుల
బాంధవునిపుత్ర నా పతిని కరుణజూచి జీవమొసగి బ్రోవవా॥ శ॥
యము:-2 తగునా నాతోడావమ్మటా-సావిత్రీసీకిది॥ త॥ వగపుమా ను
వేగబొమ్ము నీదగుమగనిజీవమివ్వవీలు లేదు॥ తగు॥

సావి:-3 పరమపురుష నీవిట్లు భాష్యను:పతికింటెను దిక్కె-వ్వరుసతు
లకు-వసువులేని జన్మమేల స్త్రీలకు-కరుణజూచి నాథునిమ్ము
బోమెద॥ శమ॥

యము:-4 లోకధర్మమిది తప్పుటన్యాయము-కీకారణ్యమునదువజాలవు-
రాకుమారి నామాటవినుమునీసోకమెల్లమానిపొమ్ము వెనుకకు॥

సావి:-5 ధర్మమూర్తినీవుయిట్టి పాపపు-కర్మజేయన్యాయమౌనకాలా-
మర్మమేల నాథునివ్వకున్నను మహినిబ్రతుక నేమిసార్థకంబు॥

యము:-6 యేమినీకు యింతభయము లేదు-నిమనోహరుని ప్రాణమింక
రాదు-కోమలాంగి నాకివ్వశక్తిరాదు-రామదాసువరదునాజ్ఞ
లేదూ॥ తగు॥

ఇక నీవు రాతగదు వెనుకకుబొమ్ము. నాకు తడవాయెను. (అని తొందరగా నడచును)

సావి:—(వెనుక నడచుచు) ధర్మస్వరూపా! మమ్మిట్లు జేయ వచ్చునా? సతికి పతికంటే భాగ్యమేమున్నది? అయిన మీకు నే చెప్ప వలయునా? ఈప్రపంచమున మీ రెరుగని ధర్మమున్నదా?

సీ॥ పతిసేవయేకదా భామలకెంతయో భాగ్యంబులనుమించుప్రాణధనము
పురుషునిసేవయే పూబోణులకు మంచి పుణ్యంబులొనగూర్చు
భూషణంబు
ప్రాణేశుపదసేవభక్తియుముక్తియుసతులుగాంచెడిమహాస్వర్గసుఖము
భర్తృసేవయెగదా వసుధపతివ్రతామణులకు నెప్పుడుమానికంబు
గీ॥ అట్టి నాసౌఖ్యమెడబాపియరుగుచుంటి వయ్యయో యెట్టులోర్చెద
నయ్యా నేను
నీకు దెలియనియంశంబునెమ్మిగలదెధర్మమూర్తివిగదయమధర్మరాజ॥

యము:—(తనలో) ఆహా! ఏమి యీమె మృదుభాషణంబులు విన్న రాళ్లయినను నీరై కరగును. ఔరా! ఈపరమసాధ్వినిజూచినమెవ

రికో యనసేల కఠినహృదయుండ నగు నాకే జాలి జనించు మన
ధైర్యంబున నన్నుకూడ అతిక్రమించినది యేమి జేయువాడ నిక న
మాటలచే సాగనంపెద. (ప్రకాశముగా) సావిత్రీ!

ఉ॥ ధర్మమధర్మముల్ దెలియు ధాత లిఖించిన వ్రాత తప్పునే
మర్మమికేల నేజనెడుమార్గము మంచిది కాదు బాల్యమ నీ
కర్మ మిటుండబోలు నది గాంచగ నెవ్వరి శక్యమౌను నా
ధర్మము ప్రాణముల్ గొనుట ధాతని సీశ్వరు నాజ్ఞ యిద్దియే!

అమ్మా సావిత్రీ! నేనేమియు అధర్మము జేయలేను. నాకా
యీశ్వరాజ్ఞ దాటవశమా! తెచ్చుటకైనను యిచ్చుటకైనను నేను
సమర్థుండనుకాను. అన్నింటికి యీశ్వరుడే కర్త. నేనాతనియాజ్ఞ దాట
వచ్చునా? నా మాటవినిని వెనుకకుబొమ్ము. నాకు కాలయాపనం
బౌచుండెను నేబోయెదను.

సావి:—మహాభాగా! మీరట్లనిన నేనేమి చెప్పుదానను. నాపై
నింత నిర్దయబూన భావ్యమా!

18 హైలాగు జంగ్రా—ఆటతాళము

రవివంశదీప బోడెడబాప న్యాయమౌను నీకు॥ రవి॥ కమలబాంధవ
పుత్ర నీవిటు కఠుబూనగ యేమిసేతును—తమను దెలియని న్యాయ
మార్గము ధరణిగలదా ధర్మరాజా॥ రవి॥

యము:—

మద్రదేశపుత్రీ నామాటవినుమా బాలాసావిత్రీ॥ మద్రదే॥ ఘోరవన
మిది నడువజాలవు—దారిదెలియదు క్రూరమృగములు—జేరి పైబడి
కరచు రావగనేరికైనా శక్యమౌనా॥ మద్రదే॥

సావి:—

కష్టాములైతేననేమి జేయూ దుష్టామృగమూలు॥కష్టా॥ యిష్టుడగు
నాప్రాణనాథునివిడచి బ్రతుకగనేల కాలా—పుట్టిపడితిన నాకు జన్మం
బుండియేమి సార్ధకంబు॥ రవి॥

యము:—

వింతా మెచ్చెగా-నీపల్కు-లూ బల్ సంతసముబాలా॥ విం॥ కాంతరో నాయంతరంగము జాలిగల్గెను నిన్నుగాంచిన-భ్రాంతిగల వరమొద్దికైనా గోరుమిచ్చెద పతినిదక్కా-॥ మద్రే॥

సావి:—

సందేహమేల నాయ త్తమామా లంధూలుచాలా॥ సం॥ నందనుని గానకను చింతలగుందుచుందురు వారలును-అర విందపద్మముబోలు నేత్రములొసగి వృద్ధుల నాదరించుము॥ రవి॥

యము:—అట్లనేయొసగితి పొమ్మా.

సావి:—ఆ నాయొక కోంతజాలిజనించినది. ధైర్యంబవలంబించి యిట్లనేవేడుకొనెదను. తల్లీ సావిత్రీ! రక్షించుము. (మరల వెనుకకుబోయి) రవిసుతా రక్షించి పతిజీవ మొసగవా?

యము:—ఏమిది మరల వచ్చుచుండెను. శాంతవచనంబుల జెప్పుటమూలమునయా? సరే రానిమ్మా. భీకరాకారమున కోపంబు జూపెద. (గంభీరస్వరముతో) సాధ్వీమణీ! ఏమి నీసాహసము.

ఉ॥ భీతియొకింత లేక నిటు భీకర మార్గములెల్ల దాటి నే
రాతగదంచు జెప్పినను రాచకుమారి తలంపవీవు యీ
ఘాతుకమైన వైతరణి గాంచినతోడనె భీతిగల్గు నా
దూతలు నేనుదక్క నిక దాటుగ నెవ్వరుశక్తులిమ్మహిన్॥

భయమింతలేక-పంతముతోడ వచ్చెదవెనుక॥ భయ॥ నయనమొసగితి నత్తమామకు-దయనుబూనితి పతినిదప్ప-నీ యనుమతిగల్గు వరమూనిచ్చెద తడవాయె నాకు॥ మద్రే॥

సావి:—

అడవులవాసి ఋషులు బాడుచుండే శ్రీ బాసి॥ అడ॥ పుడమి శత్రులకోడియుండిరి పూజ్యులగు మాయత్తమామల-యిడుములూ మెడబాసి రాజ్యము యేలగా-వర మొసగుమయ్యా॥ రవి॥

యము:—అట్లనే యొసగితి పొమ్ము. (అని వైతరణి దాటిపోవును)

సావి:—హా దైవమా! ఈనది యెట్లు దాటుదను. తల్లీ సావిత్రీ నన్ను కాపాడవా? హా ప్రాణేశ్వరా! నీవు నాకు దూరమగుచుంటివా? (చేతులు జోడించి) తల్లీ గంగా భవాని!

ఉ॥ అంగజవైరి నెత్తిపయి నాడుచు జోడకాయజాల వి
బ్బంగిని ప్రాణనాథు నెడబాసితినంచును నన్ను జూచి యు
ప్పొంగగ పాడినే యిటులబోయెను కాలుడు నిన్ను దాటి యో
గంగ భవాని సత్కృపను గావుము మార్గ మొసంగి వేగమే॥

(వైతరణి మార్గ మొసంగును. సావిత్రి దాటి కాలుని వెనుక కేగి)

సావి:—దేవా! రక్షించవా!

యము:—ఆహా! ఏమి యీసాహసము. వైతరణికూడ దాటి నదే! నేనెట్లు తప్పించుకొందును. అంతకంతకు నాకు జాలి జనించు చున్నది. (వెనుకకు తిరిగి) సావిత్రీ! ఏమి!

ఆహా యేమందూ-నీబుద్ధినాకానంద మొందూ॥ ఆ॥ సాహసంబును జూచి పోమ్మా చాలగాతడవాయె నాకు-లేక నీపరుదక్క మూడవ వరము కోరుము యిచ్చిపోయెద॥ మ॥

సావి:—

సంతాతి లేక సౌఖ్యముగనక-మంతానంబునను॥సం॥ చింతనొందెను అశ్వపతికి పుత్రశతములనొసగి బ్రోవుమ-శాంత భావంబూని మాపై చాలగాదయజూడుశమనా॥ రవి॥

యము:—అట్లనే యొసంగితిని. ఇక నాపురంబునకు రా శక్యము గాదు పొమ్ము.

(యమలోకమున కేగి కవాటములు బిగియించును)

సావి:—(తలుపుదగ్గర కేగి) ఆహా! ద్వారములేగాక తాళ ములుగూడ బిగించెను. ఇక నేనెట్లు బోవుదానను? నాకింకేది తెరవు.

హా నాథా! హా ప్రాణేశ్వరా! హా తల్లీ! సావిత్రీ! హా పంచభూతములారా! హా సూర్యచంద్రాదులారా! హా తారలారా! హా భూమ్యాకాశంబులారా! మీరైనను కరుణవహించరా! ఈ దీనురాలి మొరాలించరా! హా దైవమా! ఇంకెట్లు బోవుదానను! హా జీవితేశ్వరా! హా తల్లీ దుర్గాంబా: (చేతులుజోడించి)

ఉ॥ నావను పాదసేవ ననారతమున్ మొనబాయకుంటినా
ఆగురుమిత్రసగోత్రులను ఆదరమొప్పగ జూచెనేనియున్
భావమునందు కాళికను భక్తిగ నేము భజింపుచుండినన్
ప్రోవనొసంగు నాపుడు దోర్బల ద్వారములన్ని బాయుగా॥

(తలుపుపై చేయివేసును. ద్వారములన్నియు తెరువబడును).

(నడచుచు) హా జననీ! దుర్గాంబా! ఇది యంతయు నీ మహాత్మ్యమే కదా తల్లీ! (యముని సమీపించును)

యము:—ఆహా! యేమి యీ యద్భుతంబు. ఎవరికి దీయ శక్యముగాని తాళములు బిగించిన ద్వారములు కూడ దాటవచ్చుచుండెనే! ఆహాహా! ఈ మహిమ యెట్టివారలకైనను యింత ధైర్యముందునా! ముల్లోకంబుల నిట్టి మగువలకుందురా! ఏకభావుండనైన నాకే జాలి జనింపజేసెను. ఇంక నీమె నే నెట్లు వారించువాడ. రానిమ్ము. నా శక్తినంతయు వినియోగించెద? ఈ దండనాధుల జూచియైన వెనువకుండునా? యీ ఘోరనరకము జూచిన యెట్టి వారికైనను భీతిజనించకమానదు. వీరల జూపెదను.

సావి:—(దరికేగి) దండధరా! రక్షించవా?

యము:—బాలా! నీవింక వదలవా! ఇటుజూడుము? ఈ దండనాధులజూచి నీకేలభయములేదు. వేర్వేర జూపుచు, సాధ్వీమణీ!

సీ॥ కాలిన స్తంభముల్ కౌగలించెదువారుపరదారలనుగోరు పాపులమ్మ
కాలు చేతులువిరుగగట్టియుండినవారె దొంగలైనట్టివిద్రోహులమ్మ

కరకురాళ్ళపైన ఖండింపబడువారె పరులనుహింసించు భడవలమ్మ
గప్పునమంటలోగాలుచుండెడివారె తప్పుదెలియని గొప్పధనికులమ్మ
గీ॥ బీదసాదలకైనను భిక్షమిడక కుప్పలౌదిగ ధనమును గూర్చిపెట్టి
దుష్టులైదాసజనులనుదూషనట్టి స్వాంతు లేనమ్మ కొరతపై గ్రుచ్చబడిరి॥

అమ్మా! పిరుజూడుము. ఇట్టి దుర్మార్గ మొనరించి నాచే దండింపబడుదురు.

సీ॥ హరిభక్తులను జూచి యాక్షేపణము జేయు దుష్టులనాల్కలుదునుము వాడ
భగవదాసక్తుల బాధించువారిని రొమ్ముపై కత్తులు గ్రుమ్మువాడ
భాగ్యంబుగలదనిపరులనిందించెడుధనమదాంధులబట్టి తిరుగువాడ
ఘనులమేమని నిక్క గర్వాంధకారుల కౄరతబూని నేగూల్చువాడ
గీ॥ తప్పులన్నియు దమలోన దాచిపెట్టి యెదుటవారికి తప్పులనెంచినట్టి
పాపులనుబట్టి పలువిధ బాధలనిడి కూలద్రోతును రౌరవకూపమందు
ఉ॥ వేయికనేల భక్తులను పేదల హేళనజేయువారినే
గోయుదునమ్మ అంపమున ఘోరపిశాచములెల్ల నొక్కగా
జేయుదు క్రొవ్వుమాంసము నిజేసుకు సీకికి రాదు నమ్మనీ
వాయువు గ్రుడ్డదానవిటు లంతకులోకము జేరవచ్చునే॥

సూనులకునైనయమపురిజూడవశమే! మాపురిధర్మమిట్లుండును.

గీ॥ నేరమునుబట్టి శిక్షల నేవిధించి కఠినదండన జేతు నీ కాలుపురిని
హెచ్చుతగ్గును లేదు నాకెవ్వరైన యేకభావంబుగల్గుట నేజముండ!

కావున నామాటవిని మరలిపొమ్ము. నీ పతిజీవములు యికరావు.

సావి:—ధర్మరాజా! నీవిట్టి న్యాయాన్యాయముల పరిశీలించి, ధర్మాధర్మము లెంచి దండనలు విధించుచుండి, నన్నిట్లన్యాయము జేయుట నీకు భావ్యమా? నన్ను వృథాగా బొమ్మనుట యిది ధర్మమేనా? అటుగాక నిరంతరభర్తసేవయే వ్రతముగాగల స్త్రీలకు వైధవ్యమున్నదా? అట్లయ్యెనేని త్రిలోకసంచారి యగు నారదముని దీవన ల్లయా! కాక మా కులవేల్పు యగు సావిత్రి వరముల ప్రయోజ

నంబులా! లేక మా యత్తమామ లాశీర్వచనము వ్యర్థమానా! నే జేసిన వ్రతమెల్ల నిష్ఫలంబా! ఇన్నియుయున నేల! నే నిత్యవ్రతముగా నొనరించెడు పతిభక్తి శూన్యమానా! అట్లయ్యేనేని, ఈ ప్రపంచంబంతయు అధర్మమేనా! నీవే యాలోచించుము. ఈ శాస్త్రంబులేటికి, ఈ పంచభూతములేటికి, ఈ సూర్యచంద్రులేటికి నాకే వైధవ్యంబు ప్రాప్తించె నేని యీ ధర్మంబులన్నియు శూన్యంబు గాకయుండునా, నా పతియే బ్రతుకకున్న ముందేమికానున్నదో నీ మనంబున యోచించుకొనుము. లోకభావుండవైన నీవు నేమియు యెఱుంగని నిరపరాధుల దంపతుల నెడబాపవచ్చునే యని కనులెఱ్ఱజేసి నిలచి మూర్తీభవించి చూచుచుండును.

యము:—(ఆతురతతో)గడగడవణకుచు భయమునభినయించి, ఆహా! ఏమి! ఈ సతీమణి ప్రభావము. ఇంక నే వాదింపజాలను. (ప్రకాశముగా) ఓ పతివ్రతాశిరోమణీ! గుణభూషణీ!

మెచ్చితిచాలా వరత్రయంబు లిచ్చితిబాలా॥ మె॥ మచ్చకంటీ
నీ ప్రభావం బచ్చెరువయ్యెను నాకు-నిశ్చయముగా నొసగెదను
నీ యిచ్చవచ్చిన దేదిమైనను॥ మ్రదే॥

సా:—

సూనృతపాలా నా పతిప్రాణ మొసగుముకాలా॥ సూ॥ అనృతంబులుగావు పతివ్రత కంతికంటెను వరములేలా-ఓనృపాలా ధర్మమూర్తీ యిప్పుడైనానిల్పుకీర్తి॥ రవి॥

యము:—

సత్యవంతుని యసువులు గొనుమిదో నిత్యకల్యాణి॥ సత్యా॥
హాత్యమైనటివంటిమగడు-అతివరో యిక బ్రతుకునేడు-ధాత్రిలో
శ్రీరామదాసుని దైవకృపచే కీర్తిగాంచుము॥ మ॥

ఉ॥ మెచ్చితి నీ మహాత్మ్యమున మేను చలించెను పుణ్యరాశి నీ
కిచ్చితి కోర్కెలెల్లయును కీర్తివహించుము లోకమెల్ల యూ

సచ్చరితంబు జెప్పుకొని సౌఖ్యముగాంతురు మానవాళి నీ
వచ్చిన కార్యమయ్యె నిక వారిజనేత్రి రో సౌఖ్యమందుమా॥

19 ధన్యాసి—చతురశ్ర

నీకోర్కె లీడేరెనుజననూ రాకుమారి సావిత్రి॥ నీ॥ లోకంబున నీ
కీర్తి నల్గడల నాచంద్రార్కము నిలచియుండునిక॥ నీ॥ ప్రాకటమగు
నీ పతిజీవంబులు గాక మూను మంచివరములిచ్చితి-సోకముడుగు
మింకనిన్ను మెచ్చితి-చేకొనుమిక నీకు పుత్రసంతతి॥ నీ॥
2 నీ పతివ్రతా మహాత్మ్యమహిమ్మ చె-భీకర యముడను వెన్నగరగి
ముల్లోకంబుల నేకమాయెనిక ప్రాకునమ్మ నీదుకీర్తిలత భూమ్యా
కాశమెల్ల-క్రమ్మునమ్మనిజముగ॥ నీ॥
3 ధాత్ర వ్రాత జెరపినీదుపతిని-భూత లేను జేసితీవు-నీదగుమహిమబొగ
డి నిర్జరాళిదుందుభిమ్రోసె విరులు గురిసెనమ్మ కన్నులు మూసు
కొమ్మ పతినిగలసుకొందువు॥ నీ॥ 4 కోనులాంగి రామదాసు నేలిన-
స్వామిదయను సత్యవంతుడీభువి-పాలనంబు జేయు నీకునై దవతనము
నిల్చు-పుత్రకులను గాంచుము॥ నీ॥

సావి:—దేవా! నాను నెలవు యొసంగెదవా! మీ కరుణచే
నా నోము ఫలించెను.

యము:—తల్లీ! నీ మహాత్మ్యముబొగడ నే నెంతవాడను.
ఇక నీ కీర్తి ఆచంద్రార్కముగా నిలచియుండును. నా పల్కులలో
యేమియు నసత్యములేదు. నా దీవన వ్యర్థముగాదు. ఇక నీ పతిని
గలసి సౌఖ్యముతో పుత్రసంతతిగని వర్ధిల్లుము. (నీ కన్నులు మూసు
కొమ్ము. నీ పతియున్నచోటి కేగెదవు)

సావి:—తల్లీ! దుర్గాంబా! నన్ను నామదివిడువను రక్షించుము.
నా ప్రాణేశుడున్నచోట జేరెదనుగాకయని (కన్నులు మూసుకొనును)
(నిష్క్రమించును)



## సావిత్రీ విజయము

### రంగము—అరణ్యము

[పరివేశము—పడియున్న సత్యవంతునితో సావిత్రి]

సత్య:—(అటునిటు ప్రక్కలకు దిరుగును)

సావి:—నాథా! ఏమి యీ గాఢనిద్ర?

సత్య:—(లేచికూర్చొని కనులు నులుముకొనుచు) అమ్మా! ఎంతనిద్రబోయితిని. (దిక్కులుపరికించి ఆతురతతో) ప్రాణసఖీ! ఎంత నిద్రబోతిని. అయ్యో! యేమి నీవింత! అశ్రద్ధజేసియూరకుంటివి? అర్ధరాత్రమయ్యెను. నన్ను మేల్కొల్పక అట్లేచూచుచుంటివా? ఏమినీ తెలివి చాలుచాలువృద్ధంధులవిడచి మనమిద్దరమున్నచ్చటుంటిమి. వారేమాందురు?

సావి:—(చిరునవ్వుతో) నాథా! తలనొప్పి తగ్గినదా! మీ బద్ధకముతీరినదా? లెండులెండు యింటికేగుదము. తెల్లవారుచుండెను.

సత్య:—(ఆతురతతో) అన్నను చెలీ మరచితిని! నేను తల భారముచే నిద్రపోతిని. జ్ఞప్తికివచ్చినది. నేనొక కలగంటిని చెప్పనా! ఇట్టికల నే నెప్పుడు గాంచలేదు. ఆహా! ఏమిచిత్రమని చెప్పను! ఇప్పుడుకూడా భయముజనించుచున్నది. తెల్పిన నీవు జడిసెదవేమో?

సావి:—నాథా! నడవుడు యింటికేగుదము. తరువాత చెప్ప వచ్చును లేక త్రోవలో చెప్పవచ్చును. (లేచి నడచెదరు)

20 షైలాగు, పీల్వా—ఏకతాళము

సత్య:-కలగంటిని భామా-అది తెల్పినభయపడుదువేమో॥ క॥ బలుడగు నొక పురుషుడు నను-పలువిధ బాధలను బెట్టి-ఖలుడై నా దేహ మెల్ల గట్టిగబాధించినట్లు॥ కల॥

సావి:—2 కలగాదదినాథా-నే దెల్పెదపద ప్రొద్దుబోయె॥ క॥ నీతలి దండ్రులు విలపింతురు-చాలగ తడవాయెమనకు-తలభారముచేత మీరు-పలువరించితిరిగాని॥ కల॥

సత్య:-వృద్ధంధులవిడచి మనము-యిద్దరమూ గూడివచ్చి-బద్ధకమున నే నట్టే నిద్రబోవుచుండ యింత అర్థరాత్రియయ్యెను-అశ్రద్ధజేసి తీవు-ఓ అతివా మేల్కొలక నే॥ కల॥

సావి:-తడవాయెరువేగముగా నడచునపుడినే నుడివెదను-పుడమిని శ్రీరామ
దాసుని వివరముగ పూర్ణదయతో-విడువక బ్రోచెను నేటికి-అడవిని
యిక్కుములుతప్పెను-అనుమానంబేమిలేదు॥ కల॥

సత్య:—చెలీ! ఆ భగవంతునికి మనపై కరుణగలిగెనా! ఏమికార
ణముచేత? (ఆతురతతో) చెప్పుము చెప్పుము.

సావి:—ఇంటికేగి చెప్పెదను. నడుపుడు చాల తడవాయెను.

రంగము—పర్ణశాల

[ద్యుమత్సేనుడు, భద్రాంగి నేత్రములువచ్చి ప్రవేశము]

ద్యుమ:—చెలీ! మన సావిత్రి సత్యవంతులు రాకుండుటకు
కారణ మేమియో?

భద్రాం:—నాథా! ఈఅరణ్యమున వెనుకుందమునడువుడు.(కొంత
దూరమువచ్చి)నాథా! అల్లరుగో మనరి త్నాలమూట!మనపాలిధర్మదేవత
యగు సావిత్రి, సత్యవంతుడు వచ్చుచుండిరి. (ఒకరికొకరుతారసింతురు)

సావి + సత్య:—(నమస్కరింతురు.అందరుకలచియిల్లుచేరెదరు)
(నిష్క్రమింతురు)

రంగము—అరణ్యము

[ప్రవేశము—సాళ్వదేశపు పౌరులు]

(పరుగెత్తుచువచ్చి)బాబో సత్యవంతా! రక్షించుము రక్షించుము.

సత్య:—(ఆతురతతో) ఎదురుగాబోయి యెవరువారు ఆర్తులై
వచ్చుచుండిరి. మీ భయము వికుపుడి?

పౌరు:—అయ్యా! సాళ్వదేశప్రజలము.

సత్య:—ఇట్లు రాగతంబేమి?

పౌరు:—(అందరు సాష్టాంగనమస్కార మాచరించి) బాబో!

21 జంఝూటి—ఏకతాళము

పౌరు-చెప్పజాలమయ్యా-ఆచిత్రకేతు బెట్టుబాధ॥ చెప్ప॥ నీవిప్పుడొచ్చి
బ్రోవకున్న-యింక బ్రతుక లేముసామి॥ చెప్ప॥

శరణు సూర్యాబ్ధిహిమధామ శరణు శరణు
సాళ్వసుత నన్ను రక్షించు సత్యవంత॥

చిత్ర:—(సత్యవంతుని పాదంబులపై బడును)

సత్య:—(లేవనెత్తి) అయ్యా! నీభయము విడువుము. సేద దేరుము. నీకేమియు భయము లేదు. ఓరీ నాయందెట్టియో యోగించెదరా? నిన్ను భయపరచినవారలెవరు వక్కాణించెదరా వినగోరెదను.

చిత్ర:—(కనుమూసంబులతో వగిర్చనభినయించుచు) అయ్యా! నాదీ ప్రాంతపట్టణము. (అనుమానముతో చిన్నబ్బిన యించును)

సత్య:—అయ్యా! పాపము అలికిదీర్చుకొని సేదదేరుము. నీకేమియు భయము లేదు. నే మరలివచ్చెదను. (నిష్క్రమించును)

చిత్ర:—ఏమిజేయుదును. నేటికి నేజేయుపాపము పండెను. ఇక నాకు జీవనపుటాశ లేదు.

గీ॥ మోసములన్నియు గూడితినన్ మింగిపోన నార్తినై వచ్చిహానోటనమరి నాడు
పతుల నన్యాయమును జేయు పాపమింక పూర్తియయ్యెను నేటితో భూతలమున

నేనొనరించిన క్రూరకృత్యములన్నియు గూడి యిప్పుడు నాకీ యవస్థ సంభవించెను. అభయంబిచ్చిన లాభమేమి? నాపేరువిన్న చంపకవిడచునా? హా దైవమా! ఇంకేమిజేయుదును. ఒకరి నన్యాయము జేసినపాపం బూరకపోవునా? నా నిజవార్త చెప్పకతప్పునా? చెప్పిన నాతలిదండ్రులపాలి శత్రుండని యిప్పుడే చంపును.

గీ॥ అంధులౌ తల్లిదండ్రుల నడవిద్రోచి సాళ్వపురి మేలుచున్న నీశత్రు ననిన
నమ్మి జంపక విడచునా నేటితోడ ఆశవిడనాడవలె ప్రాణమందు నేడు॥

(నలుదిక్కులు పరికించుచుండెను)

[ప్రవేశము సాళ్వదేశ పౌరులు]

పౌరు:—చిత్రకేతా! పోకుము పోకుము. (అని పరుగెత్తుదురు)

చిత్ర:—సత్యవంతా! రక్షించుము.

[సత్యవంతుడు ఆతురతతో ప్రవేశించును]

సత్య:—భయపడకుము భయపడకుము. ఏమి యింతభయము. ఈ సత్యవంతుని దండనుండి నిర్విచారుండవై యుండుము.

# ప్రకటన

మావద్ద దొలకుదొరకు పుస్తకములు
శ్రీహరిభజనకు, నూతనభజనకు యుపయోగించును.

వరసలు మార్చుకొనిన హరికథకూడా చెప్పవచ్చును. పద్యములు, వచనములు కలిపి ఇందు కొన్నికీర్తనలువదలివేసిన అర్థముసరిపోవును. డ్రామాలోకూడా వేయవచ్చును.

చదువరులకు చిన్నబాలురకైనను సూక్ష్మముగా యుండును. నవరసాలంకారములతో అందరికి తేటతెల్లముగా తెలియు సీసరీల

## శ్రీ హరిభజన నాటకములు

పుట్టా రామదాసు గారిచే రచియింపబడినవి.

| | |
|---|---|
| పాదుకా పట్టాభిషేకము | రు **0—10—0** |
| సావిత్రీ పరిణయము | **0—8—0** |
| సావిత్రీ విజయము | **0—8—0** |
| సత్యభామ గర్వభంగము | **0—2—0** |

గయోపాఖ్యానము
కుచేలోపాఖ్యానము } అచ్చులోనున్నవి.

వీ. పీ. ఖర్చులు కొనువారే భరించవలెను.

వలయువారు:—

## పుట్టా రామదాసుగారు, మారేడుబాక

మండపేటపోష్టు, తూర్పు గోదావరి జిల్లా.

(అని వ్రాయవలెను)

N B. ఈ వరసలు తెలియనివారు మాకు వర్తమానము జేసిన మాశిష్యులుగాని నేనుగాని నేర్పుటకురాబడును. ఈ పుస్తకముల లోని కీర్తనలుగాని, పద్యములుగాని మా ఆర్డరులేనిది యెవ్వరు ముద్రించినను మా నష్టమునకు బాధ్యులగుదురు.

